Regd No. N. 45 / M 3813

వెల ఒక అణా

# గోలకొండపత్రిక

ప్రతి సోమ, గురు వారములందు వెలువడు జాతీయ పత్రిక

సంపుటము ౧౫ హైద్రాబాదు-దక్కన్ శా. శ. ౧౮౬౨ విక్రమసం॥ ఆషాఢ బ॥ ౧౦ (౨౩-౧౦-౧౩౪౯ఫ.) సోమవారము సంచిక ౨౫

బాల్కను, బాల్టిక్ ప్రాంతాల అలజడి

ఒరిస్సాలో మిశ్రమంత్రివర్గ యత్న వైఫల్యం

# బాల్టిక్ పరిణామముపై అమెరికా నిరసనము

## బాల్కన్ రాజ్యాలసమస్యలు

### హిట్లరుగారితో సంభాషణలు

గతసంచికలో చైనా సముద్రతీరమున జపాను ముట్టడియొక్క ప్రాముఖ్యమును చూచియుంటిమి. అతరువాత వచ్చినవార్తలలో చైనా జపాను వ్యవహారాలంత ప్రాముఖ్యముగలిగియుండలేదు.

జూలై ౨౮ వ తేదీ చైనావారి యుద్ధవిమానాలు చెకాస్టుపైకి బాంబులువేయవచ్చిన ౩౬ జపానువిమానాలలో పదింటిని క్రిందకూల్చినవి, పోయిన ఏప్రిలు ౩ వ తేదివరకు చైనావారి చేతులలో నాశనమైన జపానువిమానాలసంఖ్య ౧౦౪౦,

హాంగ్‌కాంగ్ నుండిలేచిపోయినవారిలో మొదటిజట్టుఅయిన ౧౫౦౦ మంది బ్రిటిషు స్త్రీలు శిశువులు జూలై ౨౮ వ తేదినాటికి ఆస్ట్రేలియాలో బ్రిస్బేనుచేరిరి.

క్రొత్తజపానుమంత్రివర్గవిధానము

క్రొత్తజపానుమంత్రివర్గమందు ప్రధానియగు ప్రిన్సు కొనోయిగారు ఆమంత్రివర్గముయొక్క విధానమెట్లుండునో చెప్పుచు, అందు మూడంశములున్నవనిరి. ఒకటి క్రొత్తరాజ్యాంగనిర్మాణము, రెండు దేశరక్షణపు ఏర్పాటులను వృద్ధిచేయుట, జర్మనీ, ఇటలీ, బ్రిటను, అమెరికా, రష్యాలతో సంబంధములను మరియొకవిధముగ సర్దుపాటుచేయుట. ఇందులో రెండవదానివిషయమై మొదట జాగ్రత్తవహించెదమనిరి. జర్మనీ, ఇటలీలతో సంబంధమును బ్రిటను, అమెరికాలతోటి సంబంధములతో ఏవిధముగా సర్దెదరని కొనోయిగారినడుగగా వారు ఆప్రశ్నకువెంటనే సమాధానము చెప్పనుగాని కొద్దిరోజులలో ఒకప్రకటన చేసెదమనిరి.

చైనాలోమాత్రము నాయకులు జర్మనీ, ఇటలీలతో ఇప్పటికంటె ఎక్కువ సన్నిహిత సంబంధముకలిగియుండవలెనను సూచనను త్రోసివేసి యుద్ధములో సహాయానికై అమెరికారష్యాలనునమ్మి బ్రిటను, ఫ్రాన్సు, జర్మనీ, ఇటలీలతో వైరములేకుండ ఉండుటమంచిదని నిశ్చయించినారు.

ఇదిఇట్లుండ ట్సెంగుటావులో జపానునావికులకును అమెరికానావికులకును గొప్పసంఘర్షణ జరిగెను. దానివిషయమై ఉభయదేశాలవారును రాయబారాలు చేయుచున్నారు.

ఈసారి వచ్చినవార్తలలో అన్నిటిలో ముఖ్యమైనది రుమేనియానుండి హంగరీ, బల్గేరియాలు కోరుచున్న ప్రదేశముల సమస్యను పరిష్కరించుటకై హిట్లరుచేయుచున్నయత్నము. ఈయత్నముయొక్క ఫలితములింకను తేలలేదు. ఎందుకనగా యత్నము ఇంకను పూర్తికాలేదు.

రుమేనియా ప్రధానమంత్రి గురుగారును విదేశాంగమంత్రి... "బ్రిటిష్ ఇండియాలోనున్న రష్మీప్రభుత్వ రాష్ట్రములో సహితము బాల్యవివాహ... సనమవసరము" తీర్మానింపబడెను. ... దొరతనమువారిని అంగీకరింప... ప్రభుత్వమువారిని కోరబడెను.

రించి ...

... హైదరాబాదు సనాతనుల మోసము ... అసత్యప్రచారముపైని దొరతనమువా... బన్సీలాకర్షించుచు వందలకొలది సంతకములతో ఒకదరఖాస్తు ప్రధానమంత్రిగారి సన్నిధానము పంపబడియెను.

---

ఇదేవిధముగ హిట్లరుగారును, కౌంట్ సియానో గారును హంగరీ ప్రధానితోను, విదేశాంగమంత్రితోను ఇదివరకే మాట్లాడియుండినసంగతిని మనమెరుగుదుము.

ఈలోగా బల్గేరియా ప్రభుత్వము వారు రుమేనియానుండి తాముకోరుచున్న డోబ్రుజాలో బల్గేరియనులు రుమేనియావారి సేనలచే ఏవిధముగ బాధింపబడుచుండిరని ఘోషించినట్లే, హంగరీప్రభుత్వమువారును తాము రుమేనియానుండి కోరుచున్న ట్రాన్సిల్వేనియాలో హంగేరియనులను రుమేనియా ప్రభుత్వమువారు చాల బాధించుచున్నారని ఘోషించుచున్నారు.

మొత్తముమీద ఈబాల్కనులలో చిక్కుల వల్లనే బ్రిటిషుపై జర్మనులదాడి ఇంకను ప్రారంభముకానట్లుకనపడుచున్నది. బాల్కనుప్రాంతములలోకూడ తనపలుకుబడిని స్థాపించుకొనజూచుచున్నట్లును, జర్మనీ ఇంతవరకు రష్యా పలుకుబడిక్రిందికివచ్చిన ప్రదేశముదాటి ఇంకను ఎక్కువభాగమును రష్యా ఆక్రమించుకొనకుండ కట్టుదిట్టములు చేసికొనకపూర్వము బ్రిటనుపై యుద్ధమును ప్రారంభింపగూడదనుకొనినట్లును కొందరు ఊహించుచున్నారు. రుమేనియాలో రాజ్యాంగమును మార్పించుటకై రష్యారుమేనియా ప్రభుత్వమునకు ఒకసూచనచేసినదని ఒక వదంతి గలదు. రుమేనియానుమాత్రము రష్యాపలుకుబడిక్రింద నుంచుటకు జర్మనీ ఒప్పుకోగలదుకాని హంగరీ బల్గేరియాలను తన అధీనములోనే ఉంచుకొనవలెనని జర్మనీచూచుచున్నదట.

రుమేనియానుండి ఏదైనప్రదేశమును బల్గేరియాకోరుచుండుట తనకుసమ్మతమే అని బ్రిటను బల్గేరియాకు తెలియజేసెనట.

రుమేనియా చమురు

ఈవ్యవహారమిట్లుండ రుమేనియాలో చమురుకంపెనీలయందు బ్రిటిషువారి భాగములను తొలగించుటకై జర్మనులు ఎవిక్షనలనైన చేయుచున్నారు. వారు ఇటీవల ప్రకటించిన ఒక శ్వేతపత్రములో బ్రిటిషువారును ఫ్రెంచివారును రుమేనియాలో చమురుగనులు జర్మనీకి చిక్కకుండుటకై వాటిని నాశనముచేయుటకు రహస్యముగ తలపెట్టినట్లు నిదర్శనము మాకుకొన్ని పత్రములు తమకు ఫ్రెంచివారినుండి చిక్కినవని ప్రకటించినారు. దీనిపై రుమేనియా ప్రభుత్వమువారు తమదేశములోని చమురుగనులను కాపాడుటకై ఏర్పాటుచేసిన చమురు సంఘమువారు రుమేనియాలో గొప్ప చమురుకంపెనీయగు అస్త్రారోమానా వ్యవహారములను పరిశీలించుచుండుటకై ఒక కంట్రోలరును నియమించిరి. రుమేనియాచమురు పరిశ్రమలోనుండు ౯మంది ఫ్రెంచి... లు అరెస్టుచేయబడిరి అందుండి ఫ్రెంచివా... ంపబడిరి ఈచమురు క్షేత్రలలో చేరి... జర్మనులని నధిరీఅనే రుమేనియా ... ప్రభుత్వపు రాయబారిని తీసివే... స్థానంలో ... ... ఇదేవిధముగ బ్రిటి... రుమేనియా రాయబారియగు టీలియాగారి... రుమేనియా ప్రభుత్వమువారు తొలగించినారు. ...ములో స్థాయిగా గారు నియమింపబడనున్నారు.

...బునదిపై ఉండిన బ్రిటిషుఓడలను రుమేనియావారు యత్నించినసంగతిని ...చియుంటిమి. ఇపుడు ఆనిషేధమును తొలగించినారు, నల్లసముద్రపురేవులగు కాన్స్టాన్జా, సులీనాలవద్దవేసిన మందుగనులను కూడ తీసివేసినారు.

కాని ఇంతలో రుమేనియావారి మూడుఓడలను "పోర్టునెడ్" అనుచోట బ్రిటిషువారు పట్టుకొనిరనియు, దానికి బదులుదెబ్బగా రుమేనియా డన్యూబుపైనున్న బ్రిటిషుఓడలపై ప్రయోగించవచ్చుననియు ఒకవార్తవచ్చినది,

తుర్కీ

తుర్కీకిని రుమేనియాకును జరుగుచుండిన వర్తకపు సంభాషణలు భగ్నమైనవనువార్త అబద్ధమని ఈసారివచ్చినవార్తలలో ఖండించబడినది కొన్ని సంభాషణల అంశములు అమలుపరచనుగూడ అమలుపరచబడుచున్నట్లు అఖండవార్తలోగలదు

తుర్కీకిని జర్మనీని ౨౫ కోట్ల ౧౦ లక్షల తుర్కీ పౌనుల విలువగల సరకులవ్యాపారమును గూర్చి కుదిరియుండిన ఒడంబడికపై ఇరుప్రభుత్వముల ప్రతినిధులును జూలై ౨౫ వ తేదీనాడు సంతకములు చేసినారు, ఈఒడంబడిక ఓ)ఐను తుర్కీ ల ఒడంబడికకు విరుద్ధముకాదని బ్రిటను అంగీకరించినది.

తుర్కీదేశ రక్షణావసరములకై తుర్కీశాసనసభయగు నేషనల్ అసెంబ్లీవారు జూలై ౨౫వతేదీనాడు కోటి ౩౦లక్షల పౌనుల అప్పు చేయవచ్చునని ఆమోదించినారు.

తుర్కీలో జర్మను రాయబారియగు హెర్ వాన్ పేపన్ గారు జూలై ౨౫వ తేదినాటికి జర్మనుప్రభుత్వముచే పిలిపించబడుటవల్ల బెర్లినునగరానికి పోయినాడు. ఈయన అక్కడికి పోయి ఏమి చెప్పునో ఏమికుట్రచేయునో అని తుర్కీలో ఆందోళన జెందుచున్నారు.

రుమేనియాలోను, యుగోస్లేవియాలోను ఇప్పటికే రష్యాపలుకుబడిని స్థాపించుకొనినది. రుమేనియానుండి రష్యాలు యిటీవల తీసికొన్న బెసరేబియా నుండియు బుకోవినా నుండియు ౫౦౦౦౦మంది జర్మనులు తిరిగి జర్మనీకి గొనిపోబడినారు.

### బాల్టిక్ రాజ్యాలు

బాల్టిక్ రాజ్యాలగు ఎస్టోనియా, లాట్వియా, లిథువేనియాలలో రష్యారాజ్యాంగములో శాఖలుగానుండుటకు తీర్మానించుకొనిన సంగతి గతసంచికలో చూచియున్నాము. ఇది రష్యా బాల్టికురాజ్యాలను బుద్ధిపూర్వకముగా అణగద్రొక్కుటయని అమెరికా స్టేట్ సెక్రిటరీయగు కార్డెల్ హల్ గారు హవానాఅనుచోట జరుగుచున్న అఖిల అమెరికారాజ్య మహాసభకు పోయియుండుటవల్ల వారిస్థానములో పనిచేయుచున్న సమ్నర్ వెల్సుగారు పత్రికలప్రతినిధులకు జూలై ౨౫వ తేదినాడు తెలిపినారు, బాల్టిక్ రాజ్యాల తీర్మానము ప్రకారము వాటిని రష్యా రాజ్యాంగములో చేర్చుకొనుటకై సుప్రీంసోవియట్ సభ ఆగస్టు ౧వ తేది సమావేశమగునట్లు నిర్ణయించబడినది. ఆదే సమావేశములో బెసరేబియాను, బుకోవినాను కూడ రష్యా రాజ్యాంగములో చేర్చుకొను విషయమాలోచించబడును. ఈలోగా ఈరాజ్యాల క్రొత్తరాజ్యాంగ పథకముల వివరములను రష్యాప్రభుత్వముతో ఆలోచించి నిర్ణయించుకొనుటకై కొందరు రాయబారులు ఎస్టోనియాచేతను లిథుయేనియాచేతను రష్యాకు పంపబడినారు.

కాని బ్రిటనులో ఈమూడు రాజ్యాల రాయబారులును పైనచెప్పబడిన ఆమూడు రాజ్యాల తీర్మానాలు నిజమైన ప్రజాభిప్రాయము గాక శత్రువుఒత్తిడిచే జరిగినవి. కాబట్టి తాము వాటిని ఒప్పుకొనమని బ్రిటిషు ప్రభుత్వ విదేశాంగశాఖ కార్యాలయములో తెలియబరచినారు.

ఈబాల్టిక్ రాజ్యాలలోని అమెరికాలోను, బ్రిటనులోను దాచుకొనియున్న బంగారమును కదలనియకూడదని రెండుదేశాల ప్రభుత్వములును కలిసి తీర్మానించుకొనినవి. ఇందుకై బ్రిటిషు ప్రతినిధి ఇటీవలనే అమెరికాకుపోయి అక్కడి కోశాధికారితో మాట్లాడివచ్చెను. ఈతీర్మానమునసుసరించి బ్రిటనులో బ్యాంకరులకు ఆజ్ఞలుకూడ జారీచేయబడినవి.

బ్రిటనులో ఎస్టోనియా రాయబారిగానుండినవారిపుడు తొలగించవేయబడినారు.



## కరీంనగరుబాంబు

### తుదకు తేలినదేమి?

కొన్నిదినాలక్రిందట కొన్ని స్థానిక ఉర్దూ పత్రికలలో "కరీంనగరములో బాంబుప్రేలింది అదిట్లా—ఇదిట్లా, దానికిసంబంధము వారు వీరు అని యేమేమో గొప్ప అపరాధపరిశోధముచేసినట్లుగా క్రొత్తఘోరమగు అంశాన్ని ఎంతోకష్టంతో బయలుపెట్టినట్లుగా ఒకవార్తాసంఘము వారు పంపడం వాన్ని ఉర్దూపత్రికలు ప్రకటించడం జరిగింది. ఇదేమిచిత్రమా అని ప్రభుత్వమువారు నెమ్మదిగా విచారణచేసి సావధానముగా ఇప్పుడు ప్రకటనశాఖద్వారా తెలుపుటయేమనగా:

"ప్రభుత్వమువారిదృష్టికి ఒక ప్రెస్సువార్త తేబడినది. కొంతకాలానికిముందు కరీంనగరులో, ఒకబాంబుప్రేలెనని ప్రకటించిరి. ప్రభుత్వమువారు విచారించుకొనగా అది అబద్ధమనితేలింది. అసలు జరిగినసంగతేమంటే ఒకవ్యవసాయకుడు ఒకకూలివాన్ని పెట్టి తుపాకిమందు సిద్ధముచేసుకుంటు ఉండినాడు. వానికి లైసెన్సులేదు. కూలివాడు మందునూరుచుండగా అదికాలినది. దానితో కూలివానికి దెబ్బలుతగిలెను. వాడు ఆసుపత్రిలో చచ్చెను. రైతుమన్ను కూలివానిభార్యకున్ను కొద్దిపాటిదెబ్బలు తగిలినవి. రైతుపై వ్యవహారము సాగింతురు. కావున బాంబుపగిలిందన్నముచ్చట అబద్ధము"

---

## జర్మనీ ఆక్రమించిన దేశాలు

బెల్జియంవారి ప్రదేశమగుకాంగోలో జాతీయోత్సవసందర్భమున అక్కడిగవర్నరు జనరలు బ్రాడ్‌కాస్టుచేయుచు కాంగో బ్రిటిషువారి పక్షముననే ఉండిపోరాడుచుండగలదనిరి.

హాలెండులో జర్మనునాజీఅధికారియగు డాక్టర్ సీస్ ఇన్‌క్వార్టుగారు జూలై ౨౫వ తేదినాడు హేగులో ఉపన్యసించుచు హాలెండు రాజకీయాలు హాలెండు ప్రజలకే వదలబడువనిరి.

నార్వేలో రాజును సింహాసనభ్రష్టునిచేయుటకు జర్మనులు అనేకయుక్తులు పన్నినటు ఇపుడు వార్తలవలన తెలియుచున్నది.

బ్రిటను ప్రధాన నగరమగు లండనులో జెకోస్లోవాకియా జాతీయసంఘము అనునది ఏర్పడినది. దానిని బ్రిటిషుప్రభుత్వమువారు జెకోస్లోవాకియాయొక్క తాత్కాలిక ప్రభుత్వములని ఒప్పుకొనుటకు అంగీకరించినారు. ఇపుడు బ్రిటనులోనున్న పోలెండుప్రభుత్వమువారును బ్రిటిషుప్రభుత్వమువారును యుద్ధములోకలిసి పనిచేయునట్లు ఒకఒడంబడిక గావించుకొనబడినది.

ఫ్రాన్సులో పెటెయిప్రభుత్వమును ఒప్పుకొనజాలమని అమెరికాప్రభుత్వమువారు చెప్పలేదు. ఫ్రాన్సుజర్మనీచే ఓడించబడుటకు ముందు అమెరికానుండికొన్న విమానములు కొన్ని మార్టినికు దీవిలోనుంచబడినవి. వీటిని బ్రిటిషువారు పట్టుకొనజూచుచున్నారు. కాని ఫ్రెంచిప్రభుత్వమువారు అట్లు ఇవ్వజాలమనినారు,

ఫ్రాన్సుకు డలాడియరుగారు ప్రధాన మంత్రిగానుండినప్పుడు జర్మనీపై యుద్ధము ప్రకటించబడియుండెను. ఇపుడు పెటెయినుగారి ప్రభుత్వము జర్మనీతో సంధి గావించుకొన్న తర్వాత అవలాడియరుగారిని మరిముగ్గురు పూర్వమంత్రులను జర్మనీపై యుద్ధముచేసినందుకై అరెస్టుచేసి శిక్షించదలచినారు ఈవిచారణ సైనికాధికారులు చేసెదరట. ఫ్రెంచిప్రభుత్వాజ్ఞ లేకపోయిన మేగంవతేరి జానుగింవలేముల మధ్య ఫ్రాన్సునుండిలేచిపోయిన ఫ్రెంచి పౌరుల ఫ్రెంచి వారసత్వపు హక్కులను. ఆస్తిని తొలగించివేయుటకు ఫ్రెంచి ప్రభుత్వమువా రాజ్ఞ గావించినారు.

బ్రిటిషువారు ఫ్రెంచిప్రజలు తమయెడ మిత్రభావము గలిగియుండుటకు దురభిప్రాయములను తొలగించు కరపత్రములను విమానాలనుండి ఫ్రాన్సులో వెదజల్లుచున్నారు ఫ్రాన్సులోనుండి బ్రిటానీఅను ప్రదేశము స్వతంత్రరాష్ట్రము కావలెనను ఆందోళనయొకటి లేచినది. జనరల్ డీగా

(౧౦వ పేజీ చూడుడు)

# బ్రిటిషుయుద్ధనౌకాదళము

## ఆరునెలలలో సాధించినపని

ఇప్పటియుద్ధము ప్రారంభమైనతర్వాత మొదటిఆరునెలలలో సముద్రముపైయుద్ధముపూర్వ ౧౯౧౪ నుండి ౧౯౧౮ సం-వరకు జరిగి యుద్ధములో మొదటి ఆరునెలలలోకన్న ఎక్కువవేగముగ వృద్ధిజెందినట్లు లెక్కలవలన కనబడుచున్నది. మొదటినుండియు జర్మనీ యూబోట్లను, మందుగనులను, విమానములను యిష్టమువచ్చినట్లు ఉపయోగించిరి.

బ్రిటిషువారుకూడ ఊరకుండలేదు. పూర్వపు యుద్ధములో బ్రిటిషువారు వర్తకనౌకలకు తోడుగా సాయుధనౌకలను పంపుపద్ధతిని మూడేండ్లుదాటిపోవువరకు అనుసరించలేదు. ఇపుడు యుద్ధముప్రారంభమైన కొద్దిరోజులలోనే ఆపద్ధతినవలంబించిరి. వర్తకనౌకలపైకూడ సంరక్షణార్థము ఆయుధముల నుంచసాగిరి. మందుగనులను తీసివేయుపని పూర్వయుద్ధములో అంతపట్టుదలగా అవలంబించియుండలేదు. కాని ఈసారి దీనికివిస్తారమైనవ్యవస్థను బ్రిటిషువారుచేసిరి.

౧౯౩౯ సెప్టెంబరు 3 వతేది మొదలుకొని ౧౯౪౦ మార్చి మూడవతేదివరకు లెక్కచూచినచో, బ్రిటిషువారివైతేనేమి, మిత్రమండలివారివైతేనేమి, తటస్థరాజ్యాలవారివైతేనేమి, మొత్తము ౧౫౯౭౨ ఓడలు బ్రిటిషువారి సాయుధ నౌకల సంరక్షణతో ప్రయాణముచేసియుండగా వాటిలో ౨౫ మాత్రమే నష్టములైనవి. బ్రిటిషుసాయుధ నౌకల సంరక్షణతో తిరిగిన ౧౦౭౫ తటస్థరాజ్యాల ఓడలలో రెండేనష్టమయ్యెను. యుద్ధప్రారంభములో కొద్దిరోజులు బ్రిటిషువారు తమవర్తకనౌకలకు తోడుగా సాయుధనౌకలను పంపు ఏర్పాటుయింకను చేయనపుడు జర్మనులు బ్రిటిషువర్తకపునౌకలకు చాల నష్టమును కలిగించగలిగిరి! కాని సాయుధనౌకరక్షణ వ్యవస్థచేయబడినతర్వాత జర్మనులు ఈవర్తకనౌకలజోలికి వచ్చుట చాలాతగ్గెను. అది మొదలుకొని తటస్థరాజ్యముల రేవులమధ్య సంచరించుచుండు, సాయుధనౌకారక్షణలేని తటస్థరాజ్యాలఓడల విఘాతములు ఎక్కువయ్యెను. బ్రిటిషువారు వర్తకపునౌకలవెంట పంపెడి రక్షణనౌకలలో తమనౌకలను ముంచుటకువచ్చుచుండు జలాంతర్గాములు సముద్రములోనెచ్చటనెచ్చట దాగియున్నవో కనుగొను సాధనములు ఉంచబడుచున్నవి.

### జర్మనుయూబోట్లకు కలిగించిననష్టము

బ్రిటిషువారు జర్మనుయూబోట్లకు కలిగించిననష్టములెక్క— యూబోట్లు ఎక్కువగా తిరుగుచుండుసమయములో వారానికి రెండుమొదలుకొని నాలుగువరకు అగుచున్నది.

౧౯౧౭లో జర్మనీ పెద్దఓడల నిర్మాణమును మానుకొనియైనను జలాంతర్గాములను నిర్మించుటకే సర్వస్వమును ధారపోయవలెనని నిశ్చయించుకొనినప్పుడు జనవరిలో ౬, ఫిబ్రవరిలో ౪, మార్చిలో ౪, ఏప్రిలులో ౫, మేలో ౫, జూనులో ౯, జూలైలో ౧౧, అగస్టులో ౧౨, సెప్టెంబరులో ౯, అక్టోబరులో ౬ వంతున యూబోట్లను తయారుచేసిపంపెను, మొత్తము ౧౨ నెలలలో ౯౭ యూబోట్లను తయారుచేసెను, ఇపుడుజర్మనీపనివాండ్రక్రమములో చాలభాగము యూబోట్లనిర్మాణమునకు కావలసినకొన్ని వస్తువులు దొరకకుండుటవలన, వాటికిబదులుగ నుపయోగించదగిన వస్తువులను కనుగొనుటకై వినియోగించవలసివచ్చుటచేతను, ఇతరకారణాలచేతను ౧౯౧౭ లో నిర్మించినంతమట్టుకైనను ఇపుడు యూబోట్లను జర్మనీ నిర్మించజాలదని బ్రిటిషువారు తలచుచున్నారు. ౧౯౩౯ అంతమగునరికి యుద్ధప్రారంభమున జర్మనీకిఉండిన ౭౦ జలాంతర్గాములలో సగముకరకైనను తమచేముంచివేయబడియుండెననియు, జర్మనులు వారానికి రెండువంతున నైనా క్రొత్తయూబోట్లను నిర్మించజాలకుండిరనియు బ్రిటిషువారు తలచుచున్నారు. ౧౯౩౯ సం॥ అంతమున జర్మనీకి ౪౫ జలాంతర్గాములుండియుండును. వాటిలో ౨౦ శిక్షణకు అవసరము. ఇకతక్కిన ౨౫ మాత్రమే పనిలో ఉపయోగించవలసియుండును. అయితే ఇవిరెండేసిమూడేసి జట్లుగా పనిచేయవలసియుండును గనుక ఎప్పుడుగాని ౧౦ కి మించి తిరుగుచుండవని బ్రిటిషు అంచనాఅయియున్నది.

సముద్రముమీద ఎంత కాపాడుచున్నను అప్పుడప్పుడు ఒకశత్రునౌక తప్పించుకొనివచ్చివర్తకనౌకలను ముంచివేయుచుండును. ఈవిధముగా "గ్రాఫ్‌స్పీ" అను జర్మనునావచే ౯ ఓడలుముంచివేయబడెను. కాని అప్పటికైనను ౧౯౧౪ అగస్టు నవంబరులమధ్య "యండన్", "కార్ల్స్రూ" అను జర్మనుఓడలుముంచిన మిత్రమండలివారి ౩౨ ఓడలలెక్కకు సమానమైనలెక్క ఇపుడులేదు.

### మందుగనులు

మిత్రమండలివారియొక్కయు, తటస్థరాజ్యాలయొక్కయు ఓడలకు జర్మనుల మందుగనులచే చాలనష్టముకలిగెను. జర్మనులు సాధారణముగా తీసివేయవీలైన మందుగనుల నేగాక, ఓడ కొంత దవ్వుకురాగానే ప్రేలి నష్టముకలిగించు అయస్కాంతపు మందుగనులనుకూడ ఉపయోగించిరి, ఈమందుగనులను కొన్నింటిని బ్రిటిషువారు సైంటిస్టులచే పరిశోధింపజేసి, ఆ ఉపద్రవమునుండి రక్షించుటకు పడవలకు ఒక "మేఖల" వంటి సాధనమును కనిపెట్టించిరి,

తుదకు జర్మనులు ఉత్తరసముద్రములో చేపలుపట్టుచుండు చిన్నఓడలపై బాంబులు మరతుపాకులు ప్రయోగించుట ఎక్కువచేయుసరికి, ఈబెస్తనావలపైగూడ బ్రిటిషువారు ఆత్మరక్షణార్థము మరఫిరంగులను నెలకొల్పిరి.

### వర్తకపు ఓడల నష్టములు

శత్రుచర్యలచే బ్రిటిషువారికి మొదటిఆరునెలలలో ౬౨౦౦౦౦ టన్నుల వర్తకనౌకలు నష్టమయ్యెను. సముద్రముపై తిరుగుచుండిన బ్రిటిషు ఓడల మొత్తము ౧౭౫౦౦౦౦౦టన్నులు, ఇట్లు నష్టమైనదానిలో మూడింటరెండుపాళ్ళు నూతన నిర్మాణము శత్రువులఓడలను పట్టుకొనుట మున్నగువాటిచే పూర్తిచేయబడెను.

జర్మనులవర్తకనౌకలు బ్రిటిషువారికి చిక్కియో, లేక స్వయముగా ముంచుకొనబడియో, బ్రిటిషువారిచే ముంచబడియో మొత్తము ౨౯౫౦౦౦టన్నులు నష్టమయ్యెను. ఇది బ్రిటిషువారినష్టంలో సగముమాత్రమేనని బ్రిటిషువారనుచున్నారు.

జర్మనువారి యూబోట్లుతప్ప మరిఏఓడలును సముద్రముపై రేవుసదలి దూరానతిరుగలేదు. అయినను వారిక్రూయిజర్లురెండు, పహరానావలు రెండు, "గ్రాఫ్‌స్పీ" అనుఓడఒకటినష్టమయ్యెను.

కాని బ్రిటిషువారిఓడలు పెద్దవి, చిన్నవిమూడ పహరాతిరుగుటకును; మందుగనులను తొలగించుటకును, వర్తకపునావలకు తోడుపోవుటకును ఎక్కడగాని శత్రునౌకకనిపించుచో దానితో పోరాడుటకును సముద్రముపై తిరుగుచునేయుండెను. కొన్నియుద్ధనౌకలు నెలలో ౨౫రోజులు సముద్రసంచారంలోనేయుండెను. బ్రిటిషు క్రూయిజరుఒకటి మూడునెలలలో ౨౯౦౦౦ మైళ్ళుతిరిగెను. ఇట్లు సదాతిరుగుచుండుటవల్ల ఇవి సర్వదా శత్రువులదెబ్బలకు సిద్ధముగా నుండవలసివచ్చెను- దీనినిబట్టిచూచుచో బ్రిటిషునౌకల నష్టము అంతఎక్కువకాదు. వారివి "రాయల్‌ఓక్" అనుయుద్ధనౌక, "కరేజియస్" అనే విమానాలుమోయుఓడ. "రావల్పిండి" అనే వర్తకపు క్రూయిజరు, ౬డిస్ట్రాయర్లు, ౪ జలాంతర్గాములు,౧౭ బెస్తనావలు యితరములైన చిన్నఓడలు కలిసి మొత్తము ౬౩౦౦౦౦ టన్నుల ఓడలునష్టమయ్యెను. ఈనష్టము క్రొత్తగానిర్మించ ప్రారంభించిన ౧౦౦౦౦౦౦ టన్నుల ఓడలలెక్కముందు గణనీయముకాజాలదు. ఈఓడలలో ౫పెద్ద యుద్ధనౌకలు, నాలుగుఅంతకంటె పెద్దఓడలు, ౬ విమానాలమోయుఓడలు, అనేకములైన క్రూయిజర్లు, డిస్ట్రాయర్లు చేరియున్నవి. ఇంతేగాక ఇతరములైన చిన్నఓడలెన్నియోగలవు, ఈక్రొత్తఓడలకై క్రొత్తనావికులుగూడ తయారుచేయబడుచున్నారు. ఇప్పటియుద్ధానికిముందు ౯౨౦౦౦ మంది నావికులుండిరి. యుద్ధారంభము తర్వాత ౭౬౦౦౦ మందిని రిజర్వుగాఉండినవారలు చేర్చుకొనబడిరి, ౧౯౪౦ అంతములోగా ౫౦౦౦౦ మంది క్రొత్తగా చేర్చుకొనబడుదురు.

యుద్ధారంభమున బ్రిటిషుసామ్రాజ్యముయొక్కయు ఫ్రాంసువారియొక్కయు, జర్మనులయొక్కయు నౌకబలప్రమాణమీక్రింద తెలుపబడుచున్నది

| | బ్రిటిషు | ఫ్రెంచి | జర్మను |
|---|---|---|---|
| యుద్ధనౌకలు, | | | |
| యుద్ధపుక్రూయిజర్లు | ౧౫ | ౭ | ౨ |
| చిన్నయుద్ధనౌకలు | — | — | ౩ |
| విమానాలనుమోయు ఓడలు | ౭ | ౧ | — |
| పెద్దక్రూయిజర్లు | ౪౭ | ౧౧ | ౬ |
| తేలికక్రూయిజర్లు | — | ౩౨ | — |
| డిస్ట్రాయర్లు | ౧౯౫ | ౪౫ | ౫౬ |
| జలాంతర్గాములు | ౫౯ | ౭౯ | ౭౩ |

### వర్తక నౌకాబలము

యుద్ధారంభములో బ్రిటిషు వారికి ౨౧౦౦౦౦౦౦ టన్నులకుమించిన ఓడలుండెను. వీటిలో కెనడాలో పెద్దచెరువులలోతిరిగే ఓడలు కొన్నియు, సైనికకార్యములకై తీసికొనబడినఓడలుకొన్నియుగలవు.ఇవిపోతేఇక ౧౭౫౦౦౦౦౦ టన్నులఓడలు సముద్రముపై తిరుగుచుండునవియుండును

ఫ్రెంచివారి వర్తక విమానాలు దాదాపు ౩౦౦౦౦౦౦ టన్నులవిగలవు.

యుద్ధప్రారంభములో జర్మను వర్తకపుఓడలు మొత్తము ౪౫౦౦౦౦౦ టన్నులఓడలుండెను అనగా యుద్ధారంభములో జర్మనులకున్నదానికంటె అయిదింతలు ఎక్కువగాయుద్ధనావలుబ్రిటిషువారికుండెను. తర్వాత మిత్రమండలవారిఓడలకు నష్టాలుకలిగినను, చాలమట్టుకు విదేశాల ఓడలు తమవైపుచేరుటవల్లను, క్రొత్తఓడల నిర్మాణమువల్లను, శత్రువులనుండి గుంజుకొనుటవల్లను మిత్రమండలివారి వర్తకపుఓడలు చాలఎక్కువయ్యెను, కాని జర్మనీకిఉన్నఓడలన్నియు బాల్టికుసముద్రము వెలుపలచాలనష్టమయ్యెను.౧౯౩౯ ఆఖరువరకు జర్మనులఓడలు ౧౦౦౦౦౦ టన్నులవి మిత్రమండలి వారిచే వశపరచుకొనబడెను, ౧౨౫౦౦౦ టన్నుల జర్మనుఓడలు ఆత్మనిఘాతము గావించుకొనెను. ఇంకనుఅనేకములైన జర్మనుఓడలు తటస్థరాజ్యాలరేవులలో దాగియున్నవి. ఇక్కడ అవి హార్బరుఫీజు చెల్లించవలసియుండును. ఇది జర్మనీకి వృథానష్టము.

### ఫ్రాన్సునౌకలు

ఫ్రెంచివారినౌకలు బ్రిటిషువారి నౌకలతోకలిసి చాలమంచిసహకారము చేసియుండెను. ఫ్రెంచినౌకలుగూడ శత్రువులనౌకల ననేకములను పట్టుకొనియుండెను, పహరాకును, శత్రునౌకలను వెంటదరిమి పట్టుకొనుటకును. వర్తకనౌకలవెంట తోడుగానుండుటకును, ఫ్రెంచినౌకలు చాల అనువైనవి,

కొంతకాలము బ్రిటిషుఓడలు కొంతప్రదేశమును, ఫ్రెంచిఓడలు కొంతప్రదేశమును పంచుకొని పహరాచేయుచుండెను, కాని తర్వాత ఇరువురిఓడలును కలసి ఆప్రదేశమునంతయు ఒకటిగాచేసి కాపలాకాయుచున్నవి

---

# క్రైస్తవవిరోధిచర్యలను ప్రతిఘటించుటకై యుద్ధము

## హిట్లరుకు హాలిఫాక్సుప్రభువు జవాబు

లండను, జూలై ౨౨

హిట్లరు రీచ్‌స్టాగులో చేసిన ఉపన్యాసమునకు సమాధానమును నేటిసాయంత్రము హాలిఫాక్సుప్రభువుగారు లండనునుండి రేడియోద్వారా తెలిపిరి. వారిట్లు చెప్పినారు:—

బ్రిటను తననిర్ణయములకు లొంగవలెనని హిట్లరుకోరినాడు. యుద్ధము ప్రారంభమైనది మొదలు జరిగిన ప్రతిసంఘటనను హిట్లరు తలక్రిందుజేసి చెప్పినాడు. అసంగతులనుగురించి చెప్పుటకై నేను కాలము వ్యర్థముచేయను, తనకు బ్రిటిషుసామ్రాజ్యమును నాశనముచేయవలయునను కోరికలేదని అతడనినాడు. కాని, శాంతి న్యాయముమీద ఆధారపడవలెనను సూచన అతని ఉపన్యాసములో లేనేలేదు. అతడు పలుమారులు జర్మనులకు ఏమాత్రము అమలుపరుచవలెనని కోరినాడో, అస్వయంనిర్ణయసౌకర్యము యూరపులోని ఇతరప్రజల కున్నదనుసంగతిని అతని ఉపన్యాసములో అతడు గుర్తించనేలేదు. నీచమైన భయమును కల్పించుటకే అతడు చూచినాడు. అతనివాదనలంతయు కేవలము బెదరింపులే ఏదోఒక దొంగసాకుతో అతడు లొంగదీసిన ప్రజల భవిష్యత్తునుగురించి అతడు మూకీభావము వహించుట గమనించదగిన అంశము.

### బ్రిటిషువారిఅచలదీక్ష

ప్రపంచములో ఎక్కువమంది అతని ఉపన్యాసమునకు సంపూర్ణముగా తప్పుఅర్థము చేసుకొని యుండిననేతప్ప, అతనిఆశలోనున్న యూరపు చిత్రపటములో ఒక్క జర్మనీయే ఉండుననియు, అది, అతడు ఒకరొకరినిగా స్వాతంత్ర్య విరహితులనుగజేసిన ప్రజలపై అధికారము చెలాయించునదిగ నుండుననియు అతిస్పష్టమైనది. మాఆశలోనున్న చిత్రము రూజ్వెల్టు అధ్యక్షుడు, స్మట్సుసేనాని విశదముగా తెలిపినట్లు, వేరేవిధముగనున్నది. యూరపు స్వతంత్రరాజ్యముల సంఘముగానుండునని వారితోపాటుమేమును కాంక్షించుచున్నాము. హిట్లరు ఉద్దేశ్యమునకు మాఉద్దేశ్యమునకుగల ఈభేదమువల్లమేము బెదరింపులకు చలింపకుండఉన్నాము. జర్మనీ బలమునంతయు ఈదేశముపై దూకించుటకు తాను సంసిద్ధమగుచున్నట్లు హిట్లరుఇప్పుడు స్పష్టముచేసినాడు. అందువల్లనే, బ్రిటనులో అన్నిచోట్లను పెద్దపట్టణములలోను, దూరగ్రామములలోనుకూడ ఒకతీరుగ యుద్ధముసాగించవలెనను అకుంఠితదీక్షయొక్కటే వ్యాపించియున్నది. హిట్లరుజయించెనా, మాకేగాక, ఇంకను అనేకమందికి, జీవితమందు కాంక్షనుంచు అనేకసత్వములు అంతమగునని ప్రతివారికిని తెలిసియున్నది. సంగ్రామములో మాసర్వస్వమును గోల్పోవలసివచ్చునని మేముగ్రహించియున్నాము. అయినను, మేము రక్షింపబూనుకొన్న మానవసత్వములు ఎంతత్యాగమైనను చేయదగినవి. కాబట్టి, వానికి మేము ఇపుడు రక్షకులముగా నిలబడియుండుట గొప్పఅదృష్టము. మేమెప్పుడును యుద్ధముకావలెననలేదు; అవసరమైనదానికంటె ఒక్కరోజు ఎక్కువగా యుద్ధముసాగించవలెనని ఇక్కడ ఎవ్వరుకోరుటలేదు. కాని మాకును ఇతరులకును స్వాతంత్ర్యము సురక్షితమగువరకు మేము పోరాటముమానము,

### స్వాతంత్ర్యాభిమానము

మాయిష్టమువచ్చినట్లు మాజీవితము గడుపవలెనని మేము కోరుచుంటిమి గెస్టపో (జర్మనురహస్యపోలీసు) ఎప్పుడుకూడ మావెనుక నిలిచి వింటున్నదేమో అని భయపడుచుండవలసినస్థితి మాకిష్టములేదు. భగవంతుని మాయిచ్ఛవచ్చినట్లు ఆరాధించుకొనుహక్కును మేము వదలుకొనజాలము మతస్వాతంత్ర్యము మేము విడువ వీల్లేదని అంతరాత్మపై ఆధారపడియున్నది. ఏలన అంతరాత్మ మరొకరికి అప్పగించగల వస్తువుగాదు, కాని, జర్మనీలోప్రజలు తమ అంతరాత్మలను హిట్లరుకుఅర్పించి, తాముచేయునది సరియాకాదాఅను ఆలోచనలేకుండ యంత్రములైపోయినారు. హిట్లరుపైదానిఫలితమేమి? అతడుమొదట అధికారముసంపాదించినప్పుడు తనఉద్దేశ్యములు చాలపరిమితమైనవనిఅతడుకష్టపడి వివరించుచుండెను. తనకుజర్మనీక్షేమముమాత్రమేకావలెనను ఇరుగుపొరుగువారినుండి తానేమియు కోరలేదనెను, కాని క్రమేణఅతని తృష్ణ అధికమైపోయి, నేడుఅతడు స్వరక్షకునివలె నటించుచున్నాడు, అతనిఘాయాగ్రహములైన మానవవాహుకులద్వారా మధ్య, ఉత్తరయూరపులో అతడు పాలించుచుండుటను మనము ఇంతవరకేచూచియున్నాము. ఇంకనుదక్షిణమున ముసోలినీ పోరాడకయే ఫ్రాన్సుపై విజయమొందితినను గర్వముతో

(౯వ పేజీచూడుడు)

# కమ్మ మహాజనసభ

## బాల్యవివాహ నిషేధశాసనము వెంటనే కావలయును

## ఏకగ్రీవతీర్మానము

ఖమ్మం, షహరేవరు ౧.

వి. వెంకటకృష్ణయ్య హైకోర్టువకీలు సూర్యాపేటగారి అధ్యక్షతక్రింద ఖమ్మంమెట్టు కమ్మ హాస్టల్‌లో కమ్మజనసమావేశము జరిగినది. ఈ సమావేశమునకు సూర్యాపేట హుజూరునగరు, మధిర, మానుకోట, ఖమ్మంమెట్టు మున్నగు తాలూకావారు పాల్గొనిరి. నిజాంరాష్ట్రీ శాసనసభ కార్యదర్శిగారినుండి (కమ్మఅసోసియేషన్) వకు పంపబడిన బాల్యవివాహనిషేధ చిత్తు తీర్మానమును సభికులకు వినిపించినమీదట యీ క్రింది తీర్మానమును సర్వజనాంగీకారముతో ఆమోదింపబడినది.

౧ శ్రీ మందుముల నరసింగరావుగారు శాసనసభలో ప్రవేశపెట్టిన చిత్తుశాసనమును ఆమోదించుచు వెంటనే దానిని శాసనము చేయవలయునని ప్రభుత్వమువారిని ఈకమ్మజన సమావేశమువారు కోరుచున్నారు.

౨ కీర్తిశేషులయిన శాఖమూరివీరరాఘవయ్యగారి అకాలమరణమునకు యీసభవారు చింతిల్లుచు వారికుటుంబమునకు సానుభూతి తెల్పుచు కీర్తిశేషులఆత్మకు శాంతిచేకూరుటకు భగవంతుని ఈ సభవారు కోరుచున్నారు.

౩ కమ్మవిద్యార్థి సహాయసంఘమునకు ప్రధాన కార్యదర్శియగు శాఖమూరి వీరరాఘవయ్యగారు పరలోకగతులగుటచే వారి స్థానమున తాతా సీతారామయ్యగారిని ప్రధానకార్యదర్శిగా యీ సభవారు ఏన్నుకొనుచున్నారు.

---

## హాల్వెల్ స్మారచిహ్నము తీసివేయబడెను

కలకత్తా జూలై ౨౩

బెంగాలు ప్రధానమంత్రిగారు బెంగాలు శాసనసభలో నిట్లువెల్లడించిరి

తక్షణమే హాల్వెల్ స్మారకచిహ్నములన్ని తీసివేయుటకై ప్రభుత్వమువారు ఏర్పాటుచేయుచున్నారు.

ఈహాల్వెల్ స్మారకాన్ని తీసివేయుటకై సుభాసుచంద్రబోసు గారు సత్యాగ్రహము ప్రారంభించిరి. ౩జూలైనాడు ఇది ప్రారంభమయ్యెను. ఇంతవరకు ౩౦౦మంది అరెస్టుఆయిరి. అందు౨౫౦మంది జయిలులోను వేయబడినారు

---

## వాఘ్మారే

హైదరాబాదు (దక్కన్) జూలై ౨౮

ఔరంగాబాదు అనంతకిషన్ వాఘ్మారే అనేపేరుగల అతడు ఒకపత్రికనుస్థాపించి ప్రభుత్వవిరోధముగా వ్రాతలు వ్రాసియుండెను ఇతనివిషయమై ప్రభుత్వమువారు కొన్ని ఆజ్ఞలు కావించియుండిరి. తర్వాత అతనిపై ౨౦౦౦ రూపాయిల జమానతు మోపిరి, ఆ విషయములో వాఘ్మారేగారు హైకోర్టులో అపీలుచేసెను. జస్టిసు లక్ష్మారెడ్డిగారు దానినివిని పోలీసుసాక్ష్యము సరిగాలేనందున మళ్లీదానిని విచారించవలెనని తీర్పు చెప్పిరి.

---

## లేడీహైదరీగారితిథి

హైదరాబాదు(దక్కన్)షహరేవరు౧౩

ముసల్మానుల మతాచారప్రకారము మరణించినవారి ౪౦వ దినమును నాడు చహలం అనుస్మారకదినము గావింపబడును. లేడీహైదరీగారిస్మారకదిన మదేవిధముగా చేయబడెను. దుల్హపాబంగ్లాలో ఇది జరిగెను. గొప్పగొప్ప ఉద్యోగులు తదితరులును జూలై౨౨నాడు యీతిథికై వెళ్ళియుండిరి ఖురానెషరీఫ్ పఠనము ప్రార్థనము జరిగెను. తర్వాత "మజ్లిస్" జరిగెను. అందు గతించినవారి గుణగణములనుగురించి ప్రశంసింపబడెను. తర్వాత మృతులసమాధివద్ద గుట్టగుట్టలుగా పూలహారాలుంచబడెను.

---





---

## ఇంగ్లీషువారి యుద్ధము ఖర్చు

ఏప్రెల్ నెలలో ఇంగ్లాండుదేశమువారు యుద్ధముఖర్చుకుగాను ౨౦౦ కోట్ల పౌండ్లు అంచెనావేసిరి. (౧ పౌండుకు సుమారు ౧౫ హాలీరూపాయిలు మారకము) ఇప్పుడు మళ్లీ క్రొత్తఅంచనా వేసినారు. దానిప్రకారము ఈయేడు ౨౭౦కోట్లపౌనుల యుద్ధవ్యయము అంగీకరించవలెనని కోశమంత్రిగారు పార్లమెంటులో ప్రవేశపెట్టినారు, అందుకై క్రొత్తక్రొత్తపన్నులు వేయుచున్నారు. ఇదివరలో యుద్ధానికి ప్రతివారము ౪ కోట్లపౌనులు ఖర్చుఅయ్యేవి. యుద్ధముతీవ్రత యెక్కువైనది ఆదివారానికి ౫ కోట్లకుఎక్కువను ఇప్పుడు వారానికి ౫ కోట్ల ౩౦ లక్షలపౌనుల ఖర్చుఅగుచున్నది అనగా ప్రతిదినము ౭ కోట్ల ౫౦లక్షల కల్దారురూపాయీలఖర్చుఅగుచున్నది.

---

## శ్రీమత్ తాడుబందువీరాంజనేయస్వామి సాంవత్సరికోత్సవము

సికింద్రాబాదు తాడుబందు శిక్కుగ్రామమధ్యనయున్న శ్రీమద్వీరాంజనేయ స్వామివారికి శ్రీ విక్రమనామసంవత్సర ఆషాఢబ ౩౦ శనివారము ది. (3-8-1940) ఉదయం ౧గంటలుమొదలుకొని రాత్రి ౨గంటలవరకు జరుపబడు పూజామహోత్సవమునకున్ను, భజనకాలక్షేపమునకున్ను తాము పుత్రమిత్ర కళత్రాదులతో విజయముచేసి శ్రీస్వామివారిని దర్శించుటకు ప్రార్థించుచున్నారము. పండిత వినాయకరావు విద్యాలంకారుగారి అధ్యక్షతన పండితనరేంద్రజీ ఆర్యోపదేశక్ మొదలగువారిచే హనుమంతుని జీవితాదర్శమును విషయమై ఉపన్యాసములుకూడ సభ ౪ గంటలకు జరుపబడునుగాన యెల్లరు సకాలమునకు రాప్రార్థితులు. స్త్రీలకు ప్రత్యేక స్థలము యేర్పాటుచేయబడినది.

ఇట్లు

స్వామివారి సేవామండలి

---

## బాల్యవివాహనిషేధ చిత్తుశాసనసమర్థనము

### ప్రధానమంత్రిగారికి వందలకొలది సంతకాలుగల దరఖాస్తు

సికింద్రాబాదు (దక్కన్) జూలై ౨౮

(ఒక విలేఖరి)

ఈ ౧౯వ జూలై ౧౯౪౦, సాయంత్రము ౫½ గంటలకు బొల్లారం హైనీరుబజారులో నెం. ౧౫ బంగ్లాఆవరణమున సేటుమిసిరీలాల్ జెట్లరాణా శ్రీశంకర్ బొల్లారంగారి అధ్యక్షతన సమావేశమయ్యెను.

ఇందుక్రమముగా శ్రీమాన్ మున్నాలాల్ జిమిశ్రీ, శ్రీమాన్, డాక్టర్ సి ఆర్. రామకృష్ణారెడ్డిజీవర్మ, శ్రీమాన్ దయాల్ సింహజిగి హాలరు, శ్రీమాన్ బిర్ధిచంద్ జిచౌద్రి, మరియు శ్రీమాన్ రామకృష్ణజీధూత్ గారు (అధ్యక్షులు, అఖిలభారతవర్ణీయమహేశ్వరీమహాసభ) "బాల్యవివాహములవలని ఉపద్రవ" పైఉపన్యసించిరి.

సర్వసమ్మతిచే "బ్రిటిష్ ఇండియాలోనున్నట్లు నిజాం రాష్ట్రములోసహితము బాల్యవివాహనిషేధశాసనమవసరము" తీర్మానింపబడెను వెనుక ముందాడక పైచిత్తుశాసనమును అంగీకరింపవలెనని ప్రభుత్వమువారిని కోరబడెను.

సికింద్రాబాదు సనాతనుల మోసము మరియు అసత్యప్రచారముపైపు దొరతనమువారి దృష్టినాకర్షించుచు వందలకొలది సంతకములుగల ఒకదరఖాస్తు ప్రధానమంత్రిగారి సన్నిధికంపబడియెను.

---

## భావసార క్షత్రియ సంఘము

బాల్య వివాహ నిషేధమును కోరుచున్నారు

(మా విలేఖరి)

తిరుమలగిరి జులై ౨౩

తిరుమలగిరి దివి ౨౦-౭-౪౦ శనివారమునాడు ఆఖిలభారతీయ భావసార క్షత్రియమహాసభ వర్కింగుకమిటి సమావేశము సాయంత్రం ౪గంటలకు శ్రీ యజంతీశ్వరగారి గృహమునందు మైసూరుసభ అధ్యక్షులగు శ్రీయుత రామచంద్రరావు పుత్తరకరగారి ఆధిపత్యమున వర్కింగుకమిటీ సమావేశము జరిగెను.

ఈక్రిందివి తీర్మానించిరి—

అన్నిప్రాంతములలో ప్రచారముచేసి కులస్థుల మహాసభయొక్క సభ్యులనుగాచేసి వాళ్లు అణాలు వార్షికచందా తీసుకోవలెను.

నిజామురాష్ట్రములో బాల్యవివాహ నిషేధ శాసనమునకై తెచ్చినబిల్లును యీసభవారు అంగీకరించుచు యీప్రభుత్వమువారు తప్పక అమలుపరచవలయునని తీర్మానింపబడెను.

బొంబాయిలో మద్యపాన నిషేధమును తీసివేసినందున యీసభవారు చింతిల్లుచున్నారు.

శ్రీ శ్రీ. భగ శివణారావు హైద్రాబాదుగారును అష్టేకరీ నారాయణారావు సికింద్రాబాదుగార్ల అకాలమరణమునకు యీసభవారు దుఃఖించుచు వారిఆత్మలకు భగవంతుడు శాంతిచేకూర్చుగాకయని ఆమోదించిన తదుపరి భావసార క్షత్రియసమాజము (బల్లారికర)తిరుమలగిర తరఫున మైసూరు వాస్తవ్యులు సుప్రసిద్ధ హిందు జాతీయ సేవాధురంధరులును 12వ ఆ.భా. క్ష. మహాపరిషత్ (బొంబాయి1939) అధ్యక్షులును అగు శ్రీయుత రామచంద్రరావు పుత్తరకరగారి గౌరవార్థము యింక యితరప్రాంతములనుండి వచ్చిన వర్కింగుకమిటీసభ్యుల గౌరవార్థము శ్రీయుత బాలారామపన్తాలెగారి ఆధిపత్యమున సమావేశమైరి. సభకు సుమారు 150మంది సికింద్రాబాద హైద్రాబాద తిరుమలగిరినుంచి వచ్చియుండిరి.

యస్. వి. రావు శ్రీగుండేరావు శ్రీరామచంద్రిరావుగారు మహారాష్ట్రి పాఠశాలస్థాపించుటకు పాఠశాలబిల్డింగు నిర్మాణమునకు విరాళములను పోగుచేసేఅందుకు అపీలుచేసిరి. వారుపూర్ణ విరాళము యిస్తామని వాగ్దానముచేసిన తదుపరి అధ్యక్షులవారికిని వచ్చినవారికందరికిని అభివందించుచు పుష్పమాలాలంకృతులగావించి అల్పాహారవిందుతో సభ జయప్రదముగా ముగిసినది.

### మళ్లీ ఒక్కరూపాయి నోట్లు

సిమ్లా, ౨౪ జులై

ఈదినము ఒకఆర్డినెన్సు (ఫర్మాను) బ్రిటిష్ ఇండియా ప్రభుత్వమువారు చేసినారు. దాని ప్రకారము—

ఇకముందు కల్దారు రూపాయలకుగాను ఒక్కరూపాయినోట్లు జారీచేయబడును.

### ఖండన

శ్రీ గోలకొండపత్రికా సంపాదకులకు:—

అయ్యా.

గత మీగోలకొండపత్రికలో చదివినవానికంటె నాకలిపాదుమేలని శీర్షికచూచితిమి. అట్టి ప్రకటనకు ప్రతికూలము ఈక్రింద వ్రాయుచున్నాడి.

గోపపల్లిజాగీరులో శ్రీయుత రఘుపతిరెడ్డిగారు చాకలియల్లయ్యను శివాలయంలో పెంచబడు పూలమొక్కలను పీకించడం వారికి అష్టకష్టాలను పెంబడించడం కేవలముఅబద్ధము. శ్రీయుత రెడ్డిగారికి మతపాక్షిక వైషమ్యమున్నదని నేను లక్షాధికారిననిన్ని భావనలేదు. వారుఉదారపురుషులు, జీవాభిలాషి, అతిథి అభ్యాగతుల ఆదరించడం వారిముఖ్యకర్తవ్యము, లక్షాధికారినని స్వగర్వము గాగాని, జాగీరుపటేలుగారిననికాని ప్రజలను బాధించడంలేదు చివరకు పెట్టిచాకలికూడ వీలగునంతవరకు వాన్ని ప్రజలకుదోహదిస్తు యుండేవారు. అట్టివారిపై నిర్హేతుముగా పత్రికమూలముగా వారికార్యముల సమస్తజనులకు తెల్పడము శోచనీయము.

ఇట్లు
వ్యతిరేక ప్రకటనాభిలాషి.

### యుద్ధప్రచారకసమితి

హైదరాబాదు(దక్కన్)షహరేవరు ౧౫

హైద్రాబాదు రాష్ట్రములో యుద్ధమునుగురించి పరిశుద్ధప్రచారము సాగించుటకుగాను ఒక ప్రత్యేకసమితి ఏర్పాటుచేయబడినది. దానికి గౌ. న్యాయశాఖామంత్రిగారును స్లాటర్ గారును గ్రాఫ్టన్ గారును నవాబు ఆలీనవాజ్‌జంగు బ. గారును ఏర్పాటుచేయబడినారు, గౌ. న్యాయశాఖామంత్రిగారు దీనికధ్యక్షులు.

# మా సినిమా పేజి

## సినిమా కథలు

★ సీతారామారావు

లక్షలకొద్ది రూపాయిలు వ్యయపరచి తయారుచేసిన ప్రసిద్ధనిర్మాతల చిత్రాలుకూడా ఆర్థికంగా అధికనష్టదాయకంగా యుంటున్నవి. దీని మొదటిప్రతిఫలం డిస్ట్రిబ్యూటర్లకు. తరువాత ప్రదర్శనాధిపతులకు, వర్తిస్తున్నది. డిస్ట్రిబ్యూటర్లు తమచిత్రాలనుగురించి యెవరు విమర్శించకూడదని కోరుతారు. వారు ప్రయోగించే అస్త్రం, పత్రికలకు తమ అడ్వర్టయిజుమెంట్లు యివ్వకపోవడమే. బాధ్యతను గమనించినపత్రికలు సినిమా కళాప్రపంచంలో సారస్యతాన్ని నిర్మించే విమర్శకులు, వీరలపొగడ్తలను,నిందలను లెక్కించరు.

ప్రతిఫిలిం నిర్మాత, సువ్యాద్విమర్శలుకావాలి యని ఘంటాపథంగా ఉపన్యాసవేదికలనుంచి పలుకుతాడు. కాని విమర్శచూసేటప్పటికి వారిమానసిక పరిణతికి, కుదురుబాటుతగ్గిపోతుంది. కేవలం స్తుతిపాఠముల వినకలితోనే. తాము ప్రతిభాశాలురమని యెంచుతారు నిర్మాతలు.

చలనచిత్రాలు ఆర్థికంగాను కళాదృష్టిలోను నష్టదాయకంగావడానికి కారణంఏమిటి? ఒకటికి తక్కువగాని కారణాలు ఏకకాలంలో ఏకముఖంగా, చలనచిత్రాలదుర్దశకు త్రోవతీస్తున్నది. అన్నిటంటె ముఖ్యంగా నిర్మాణానికి పూనుకొనే ఉదారుల ఆడంబర ప్రియత్వం మొదటికారణం. ఉత్తమశ్రేణికిచెందిన దర్శకులు నిర్మాతలు, తమ కళలో సముచితమైన నైపుణ్యంపొంది ప్రజామోదాన్ని పొందినతరువాత, నూతనపంథాలవైపు తమదృష్టిని మరలుస్తారు. అపూర్వవిషయ సంకలనంలో తమమేధాశక్తిని వినియోగిస్తారు. తమ కాలానికి. సంఘానికిమించిన నవ్యతను సృష్టించడంలో తమచిత్రాలు సాధారణప్రజలకుగూడా ఉద్దేశింపబడినవనే విషయాన్ని విస్మరిస్తారు. ఆకథలు, గంభీరంగా ఉంటవి. మానసికపరిణామము తత్వచర్చపూనుకొంటవి. ఈవిధానం, సామాన్యప్రేక్షకునకుఅంతుపట్టను, రచయితలదూర్ధ్వ దృష్టి. దర్శకుల ఆడంబర వ్యామువల్ల భారతదేశంలో ప్రసిద్ధనిర్మాతలు తయారుచేసినకొన్ని చిత్రాలు మిక్కిలి దయనీయస్థితిలో నున్నవి.

ఎటువంటికథలు సినిమాకు గావాలి? ఎటువంటి కథలు ప్రజామోదంపొందుతవి. వీటిఆమోదాన్ని నిశ్చయించేపరిమాణం ఏమిటి? నిర్మాతలు తమ కథలకోసం అధికశ్రమపడతారు. నిజానికి కథలలోని ఔచిత్యాన్ని, గుణవిశేషాన్ని నిశ్చయించడానికి ఒకకొలబద్ధలేదు! కాని తమకథలలోని గుణాన్ని పరిశీలించడానికి దర్శకులు, నిర్మాతలు, రెండు మూలసూత్రాలనుమాత్రం తేలికగా అవలంబించవచ్చు. కథపూటింగు ప్రారంభించడానికి పూర్వం, ఆ చిత్రానికి ఉద్దేశించబడిన (Extras)లను అక్కడపనిచేసేవాళ్లను,రచయితలను అక్కడయుండే విద్యార్థులను పిలిపించి Shooting script, వారికి చదివివినిపించి అందువల్ల వారికికలిగేప్రతీకారము (reaction) జాగత్తగా గమనించాలి.

సాధారణం ఎక్కువచిక్కులు. లేకుండానూటిగా నడకసాగించే కథలు ఎక్కువభాగం ప్రజామోదంపొం తవి. సమస్యాపరిష్కారాలు చేసే చిత్రాలు., నాగరికతకు మెఱుగుపెడ్డే చిత్రాలు పనికిరావని ఉద్దేశ్యంకాదు అటువంటి చిత్రాలు ఒకతరగతిచెందిన ప్రేక్షకులనుమాత్రమే సంతోషపెట్టకలుగుతవి.

కథను విన్నతరువాత సామాన్యప్రేక్షకునకు కలిగే మానసిక పరిణామాన్ని, విద్యావంతులకు చూపట్టే భావాలను సమన్వయిస్తూ రెండుతరగతు లవారికి ఉపయుక్తమే మార్పులను. కళాదృష్టికి అనుగుణ్యంగా కథను పెంచడము, లేకతగ్గించడము జరుగవలసియుంటుంది. అప్పుడే. అనేకకథలు విశేషప్రజామోదం పొందగలిగియుంటవి.

—

## స్టూడియో వార్తలు

**ప్రభాత్ స్టుడియో:**

డైరెక్టర్ శాంతరాం, 'పాదుషి' అనేఫిల్ము రిహార్సల్సు పూర్తిచేసినారు. వీరుమరియొక పౌరాణిక చిత్రంతయారుచేయడానికి ఉద్యుక్తులౌతుయున్నారు. దామిలి సంతపక్కబాయిచిత్రమునకు కావలసిన సన్నాహములలో నిమగ్నులైనాడు.

**న్యూథియేటర్సు**

హిందీ, బెంగాలి భాషలలో 'నర్తకి' అనే చిత్రాన్ని తీస్తున్నాడు డైరెక్టర్ దేవకీబోస్ యెనవు తొలిమెఱుపులలోని ఒకయువకుని పరచియంకలిగినది ఒకవారాంగనకు వారిప్రేమత్యాగము యీకథకుముఖ్యసూత్రాలు లీలాదేశాయి, నాజముల్ హుసేన్ యీచిత్రములో ప్రధాన పాత్రలు నిర్వహిస్తున్నారు. కన్నన్‌బాల, పహారి సన్యాల్ నటించిన "హార్ జీత్" చిత్రము త్వరలోనే విడుదలయౌతుంది.

**సుదామ పిక్చర్సు:**

"సజని" అనేచిత్రాన్ని సర్వోత్తంబాదామి డైరెక్టుచేసినాడు. ఈచిత్రంలో సబితాదేవి, పృథ్వీరాజ్ డిక్సిట్, నూర్జన్ ప్రభృతులు పాల్గొనినారు. పల్లెటూరిజీవితాన్ని చక్కగాచూపెట్టెతూన్నదీ చిత్రము

**స్టేజిఫిలింకంపెని**

కొన్ని సంవత్సరాలక్రితం స్టేజిఫిలింకంపెనీ పేరుతో "ఖూన్-క-ఖూన్" చిత్రాన్ని భారతదేశానికి అర్పించిన ప్రసిద్ధురుస్తుమోడీగారియాజమాన్యంక్రింద, మరియొక స్టేజిఫిలిం "సాక్ దామన్" అనేచిత్రం తయారౌతూంది సినిమా కళ, దినదినాభివృద్ధిపొందుతూ, నాటకకళ పుట్టుపూర్వోత్తరాలు తెలుసుకొన కుతూహులపడే భావికాలానికి శాశ్వతిరూపం మొసగేవి స్టేజినాటకాలు-వాటినికూడా సినిమాలలో చూపించి వాటిజీవితానికి శాశ్వతత్వము కలిగించపూనుకొనడము, కొలదిపెట్టరానిసేవచేయడమె

**మినర్వామూవిటోన్:**

సొహరాబ్‌మోడిగారిచే డైరెక్టుచేయబడిన "బరోసా" పూర్తియైనది యెడిటింగ్ చేయబడుతూన్నది ఒకనెలదినములలో యీచిత్రము విడుదలకు సిద్ధమౌతుంది. ప్రసిద్ధులు చంద్రమోహన్ సర్దార్ అక్తర్ యీచిత్రములో పాల్గొనినారు.

**దేవికారాణి**

తమభర్త హిమాన్సురాయిగారి అకస్మికమరణమువలనకలిగినసంతాపముతో, ఒకసంవత్సరము వరకు దేవికారాణి ఏచిత్రములందును నటించదని తెలుస్తూన్నది.

**పంచోలి ఆర్ట్ పిక్చర్సు:**

నూర్జన్, శేచికమల మొదలగువారి ఒకనూతన సాంఘిక చిత్రాన్ని తీయడానికి, వ్యవస్థాపకులు పంచోలిగారు ఉద్యుక్తులౌతూన్నట్లు తెలుస్తుంది.

## హాలివుడ్ రచయిత ఆత్మహత్య

"డాన్‌పెట్రోల్" చిత్రము వ్రాసినందుకు ఎక్కుడుమిప్రఖ్యాతిపొందిన జాక్‌మాంక్‌సాండర్సు, ప్రసిద్ధసినిమనటి ఫెర, భర్త, ఆత్మహత్యచేసుకొనినట్లు తెలుస్తూన్నది.

## జపాను సినిమా జిజ్ఞాస

జపాను దేశములో రమారమి 150 ప్రసిద్ధ ఫిల్ము పరిశ్రమాలయాలు యున్నవి. ఇక్కడ సంవత్సరానికి 17000 చిత్రాలుఅవసరం. ఇక్కడ 25000 సినిమప్రదర్శనశాలలుయున్నవి. 1937వ సంవత్సరం జపానుసినిమాకళ, దేశీయప్రభుత్వపుతోడ్పాటు చేకూర్చుకొనినవాటినుండియు, యీకళసత్వరాభివృద్ధిని గాంచుచున్నది. జపాను దేశములోనికి దిగుమతియైనచిత్రాలు.

| | 1934 | 1935 | 1936 | 1937 |
|---|---|---|---|---|
| అమెరిక | 242 | 273 | 217 | 125 |
| ఇతరదేశాలు | 53 | 55 | 38 | 17 |

గతసంవత్సరపు అంతర్జాతీయప్రదర్శనములో జపానుచిత్రములు ప్రసిద్ధములుగ పరిగణించబడినవి,

—

## హైదరాబాదు యుద్ధసహాయము

సైనిధికి 22 జూలై సోమవారమునాడు 3082హాలీలు 5592 కల్దారులు వసూలయ్యెను. అందు ముఖ్యమైనవి.

వీ డీ. రాజలింగం మొదలి. బీ.రంగయ్య, బీ.వీ ముత్తన్న. యం నారాయణగారు తలా550రూ. రా.సా, దూర్వాసులుగారు 250రూ, యస్. వి లింగన్న, సి నరసింహులు. యన్.సి వయ్య. వీ అంతయ్యగారు తలా 220రూ. వీ.ఆర్,గోపాల్ ఏ.రాఘవులు. కృష్ణయ్య, జీ.లక్ష్మయ్య, బల్లబాలయ్య తలా౨౦౦రూ. డీ చెన్నకిష్టయ్య, ద్వారకాప్రసాదు, రాధేరామ్‌జాలాల్ కౌలూరాం తలా200రూ,

మంగళవారము 23 జూలైనాడు 8515హాలీలు 101కల్దారులు వసూలయ్యెను, అందు ముఖ్యమైన వి. పాండురంగరావుదేశముఖ్ గుల్బర్గా, కృష్ణారావు దేశముఖుగారలు తలా 200రూ. మేజర్ డార్లింపుల్ హై, స.ఏజాజ్ హుసేన్, వెంకట్రావుదేశపాండ్యా తలా100రూపాయిలు.

**యుద్ధనిధి**

15-7-40వరకు 158632హాలీలు, 21310కల్దారులు నెలచందాలు 4433హాలీలు. 3804కల్దారులు 15-7-40తర్వాత కస్టమ్సు కోర్టులఫ్ వార్డువారిద్వారా 11000రూ. యాథీర్,మాన్వీ, ఖుదవాదునాగరకర్నూల్, చింపోలీ తహసీల్లనుండియు ఉస్మానాబాదు, పర్బనీ. నాందేడు భోనగిరి తాలూకాల్లనుండియు మరి యితరస్థలాలనుండియు చందాలు వసూలైనవి. ఇపన్నీకలిపి యిప్పుడు 176366హాలీలు. 25115 కల్దారులు అయినవి,

—

## హిట్లరుకు హాలిఫాక్సు జవాబు

(౨వ పేజీతరువాయి)

ఆతనుజయింపని మన్యధరాపము ద్రమునకు అధికారియగుటకు నమ్మించవచ్చును. హిట్లరు మానవుల.జాతులభవితవ్యములనిర్ణయమునపశుబలమే ప్రధానసాధనముగపరిగణించుచున్నాడు.జర్మనీకి అపశులమున్నది. అందువల్ల దేశములు ఎట్లకలిసి జీవించవలెనో జర్మనీయే నిర్ణయించవలెనట! వారికది యిష్టములేకపోతేనేమి? హిట్లరుదృష్టిలో, మానవుడు దుర్బలుడు, పొరపాటులొనర్పువాడు, ఉత్తరువులను శిరసావహించుటకు పుట్టినవాడు. ఆతను త్వరలోనే తనయజమాని యిష్టప్రకారము నడుచుకొన నేర్చుకొనును. హిట్లరుదృష్టిలో, ఆడినమాట నిలబెట్టుకొను ప్రాచీన మర్యాద దుర్బలత్వసూచన. గట్టి దృఢమనస్కులకు తగనిది. న్యాయమునుందరఅందరును ఒకటేఅను సూత్రము తెలివితక్కువది. అసమానత్వము సర్వాధికారము గలిగియుండ దగిన ప్రభుత్వమునకు ద్రోహమగును. అవిశ్వాసము, క్రౌర్యము క్రూరకర్మలు- ఇవితన ఉత్తరువుచే జరిగినవి కాబట్టి హిట్లరుకవి న్యాయమైపోయినవి.

**బ్రిటిషునాయకత్వము**

ఇది, క్రీస్తుద్వేషియొక్క ముఖ్యమైనసవాలు. మనము క్రైస్తవులము. కాబట్టి మనసర్వశక్తులచే దానిని ప్రతిఘటించి పోరాడుట మనధర్మము. బ్రిటిషు ప్రజాస్వామ్యములోని ప్రజలు వారితోపాటు సత్యమును. ధర్మమును, స్వాతంత్ర్యమును ప్రేమించువారును ఈ క్రొత్తహిట్లరు ప్రపంచమును ఎప్పుడుగాని అంగీకరించరు. స్వతంత్ర ప్రజలు జర్మనుదాసులుగారు; అందరిమేలు కొరకు మనఃపూర్వకముగా సహచరము లైయుండుటే ముఖ్యమైనవి, బ్రిటిషుప్రజలు చూడగోరు క్రొత్త ఉత్తమవ్యవస్థ స్తంభములు. ఆగాధ మానవిషాదమును హిట్లరువిజయమనగా అదే. అర్థము రాకుండ చేయుటకు నేడుజరుగుచున్న పోరాటములో నాయకత్వము వహించుచున్న మనదేశము సమస్తప్రజలకు ఉత్తమజీవితమార్గమునకు త్రోవజూపునదిగా నుండగలదని నేను తలంచుచున్నాను. ముందువెనుకలు, ఆలోచించిచూడ, మనము ధైర్యముగానుండవచ్చును. హిట్లరునవ స్వస్తిక పతాకమును తన యిచ్చవచ్చినచోట నాటవచ్చును. కాని, బ్రిటనుబలమును తునుమాడనిచో ఆతని సామ్రాజ్యపు పునాదులు ఇసుకమీద కట్టినవగును. ఆతడు ఓడించిన ప్రజలుతమ వ్యసనములలో ఆతనిని శపించుచు మనదీవిగడ్డకోటలపైదాడిలో ఆతనికి ఫలము కలుగరాదయని ప్రార్థించుచున్నారు. మేము ముందుకుదూకి దెబ్బకుదెబ్బ తగిలించుదినము ఎప్పుడాఅని వారు ఎదురుచూచుచున్నారు. మేమువారికి ఆశాభంగము కలిగించమని నిశ్చయముగా నమ్మవచ్చును. అప్పుడు బలాబలనిర్ణయముల అంత్యముహూర్తము వచ్చును. యూరపువిషయములో హిట్లరుఅనుకొన్న పిచ్చిఆలోచనలు ఆజేయమగు మానవస్వాతంత్ర్యకాంక్షయొక్క ప్రభావముచే పటాపంచలగును. యూరపు సరిహద్దులకు దూరముగా విశాలమైన అట్లాంటిక్ మహాసముద్రమునకు ఆవల ఆతనిపనులను నానాటికి హెచ్చింపుచు, ఏవ్యాభావముతో యాచుచున్న బలిష్టదేశములున్నవి. అమెరికాస్టేట్సు ప్రజలుతమ సౌధములను ఈ జర్మీ అవేశపరుని ఒప్పుచెప్పుటకై నిర్మించలేదు. ఆతని వక్రదృష్టిని సంకుచితమని వారు నిర్ధారణపరచుకొన్నారు, ఆతని మంత్రము ద్వేషమంత్రము, ఆతనివిధానము పశుబలవిధానమని వారు గమనించినారు. క్రూర నిరంకుశత్వమున మానవతత్వమును దాస్యమొనర్చుటే మానవాళికని సందేశమనిగూడ వారుగుర్తించినారు,. ఈనష్టనికి యిప్పుడు బలియైపోయినవారు యెంతగాఢభక్తిగా ప్రార్థించుచున్నారో, అంతగాఢముగానే అమెరికా మహాప్రజలుగూడఈదుష్టునిపై, ఆతనిచర్యలపై మనము విజయముగాంచవలెనని ప్రార్థించుచున్నారు. దానిచే మనముధైర్యము తెచ్చుకొనవచ్చును. మనదేశానికివలెనే వారి దేశానికికూడా క్రీస్తుబోధ, భగవంతునియందు విశ్వాసము మూలాధారములుగా నున్నవి.

మనప్రియతములను కాపాడవలసినదనియు, మనదేశముయే మహత్తరప్రయోజనము కొరకు యుద్ధము చేయుచున్నదో దానిని ఆశీర్వదించవలసినదనియు భగవంతుని ప్రార్థింపవలెనని అందరినిగోరుచు, హాలిఫాక్సుప్రభువుగారు తమ ప్రసంగమును ముగించిరి.

—

సంవత్సరము చందా
౬ పావు రూపాయలు
ఆరుమాసాలకు
౩ రూపాయలు
బ్రిటిషిండియాలో
సం॥చందా
౭-౮-౦ కల్దారు.
పాతపత్రికలకు
వెల ప్రత్యేకము.

# గోలకొండ పత్రిక

# Golkonda Patrika

The only
Popular Paper
That reaches
The masses
In the Dominions

Best Medium
for
Advertisement

PUBLISHED ON EVERY MONDAY AND THURSDAY

**Volume 15** | **Hyderabad-Dn.** | **Monday 29 July 1940** | **Number 25**

బహిరంగలేఖ ౧.

## హైద్రాబాద హిందూ మహాసభ

ఆంధ్ర మహాసభాధ్యక్షుల వింతవైఖరి

కార్యకారిణీ సభవారి ప్రకటనలేమి

గోలకొండ పత్రికాధిపతుల సన్నిధికి:-

మహాశయా! దయచేసి యీయుత్తరంబీపత్రికలో ప్రకటింపప్రార్థితులు.

శ్రీ ఆంధ్రమహాసభాధ్యక్షులగు మం రామచంద్రరావుగారు ౧-౧౦-౪౯ ఫ సాదు గోలకొండపత్రికలో ప్రకటించిన తాకీదు మరియు అ. మ. కా. సం. ౧౫వ మహేవరు నాడు ప్రకటించిన తీర్మానమును ఆంధ్రదేశీయులగు హిందువులను ఆశ్చర్యవిషాదమున ముంచుచున్నది. హిందూ మహాసభ పాక్షికసంస్థ కావున, జాతీయ మహాసభ యగు ఆంధ్రమహాసభా సభ్యులు వైసభలో పాల్గొనగూడదని వీరిఆజ్ఞ అయితే వీరిఆజ్ఞ ఎంతవరకు నియమబద్ధమైయున్నది మనము విచారింతము ఆంధ్రమహాసభ నియమావళిలో "ప్రతిఆంధ్ర వ్యక్తియు, పదునెనిమిది సంవత్సరములకంటె మించి వయస్సుగలిగి, వ్రాయను చదువను నేర్చియున్నచో, ఈసంఘము సభాసదు డు కావచ్చును." అని మాత్రమున్నది. నియమావళిలో ఎక్కడను "మతపాక్షికసంస్థల"లో చేరగూడద"ను నిషేధములేదు. కాబట్టి కార్యకారిణీసంఘమువారీ నిరంకుశప్రకటనలు చేయుట నియమవిరుద్ధము నియమావళిలోలేదు గావున నీ యీవిషయమున, కార్యకారిణీసభ, అధ్యక్షులవారు, ప్రకటింపవలసివచ్చినదందులకేమో! అయితే హిందూప్రజామండలి స్థాపింపబడి చాలాకాల మయ్యెను. అట్లే యిత్తెహాదుల్ ముసల్మీన్ సంఘము స్థాపింపబడి చాలాకాల మగుటయేగాక హైద్రాబాదునగరములో బ్రహ్మాండమగుసభ జరుపబడినది. వివిధప్రాంతములలో సభలు జరిపి ప్రచారము సాగించుచున్నది పాపము! ఆంధ్రమహాసభ అధ్యక్షులవారుగాని, కార్యకారిణీసంఘముగాని పై యిత్తెహాదుల్ ముసల్మీన్ సభలలో, "జాతీయసంస్థ" యగు ఆంధ్రమహాసభకు జెందిన మహమ్మదీయసభ్యులు, పాల్గొనరాదని ఏల తాకీదు జారీచేయ లేదు? అప్పుడు ఆంధ్రమహాసభాధ్యక్షులు మౌనీభావము వహించుటయే "విధ్యుక్త ధర్మ"మని భావించిరా? హిందువులు నేటికాలము నకొక సభ జరుపుకొనుచుండగా, వీరిదృష్టిలో "పాక్షిక"సంస్థయు, "పోటీగా" స్థాపింపబడినసంస్థయు, "రాష్ట్రమున అంతఃకలహములు"కల్గించుసంస్థయు అయ్యెనా? విచారకరము! శాంతం! పాపం!!!

హిందూమహాసభ ఆదర్శములతోను కార్యవిధానములతోను శ్రీ అధ్యక్షులవారికి "ప్రసక్తి" లేకపోవుటచే "అవాదవివాద చిక్కులలో" పడదలుచుకొక చల్లగా తప్పించుకున్నారు అదిగూడా చర్చిస్తే లోకానికిగూడాబాగ అర్థమయ్యేగ! ఇక ఆంధ్రమహాసభ అన్నపు "నిష్కళంకజాతీయ పునాదుల"పై నడుచుచున్నదా'యను విషయమునుగూర్చి రెండుమాటలు మనవిచేసెదను

(౧) ఆంధ్రమహ సభలో ఎంతమంది మహమ్మదీయసభ్యులున్నారండీ? వారిలో కొంచము పేరుప్రతిష్ఠ గలవారెందరు?

(౨) హైద్రాబాద జాతీయమహాసభ స్థాపింపబడినపుడు ఆంధ్రమహాసభను అనుబంధముగా జేర్చి "ఏకాశయములు" కలిగియున్న సంస్థయని ప్రభుత్వమునకు నచ్చజెప్పినచో ప్రభుత్వము హైద్రాబాదు జాతీయ మహాసభను రద్దుజేయకుండా నుండెడిదే "జాతీయపునాదుల"పై నిర్మింపబడిన యీసంస్థను జాతీయమహాసభలో ఎలచేర్పలేదు?

(౩) ఆంధ్రమహాసభ సమావేశములలో ప్రతినిధులబసలకు జెందిన ఆవరణములలో "ఆర్యసమాజ ప్రచారము జరుగుచుండుటలేదా? ఆంధ్రమహాసభవారిడబ్బు తినువారె ప్రధానప్రచారకులు, సభలో మత (ఆర్య) ప్రచారము జరుపుచుండలేదా?

౪ "మతపాక్షికత్వేమలేని ఆంధ్రమహాసభ గారి అధ్యక్షులను, మల్కాపుర ఆంధ్రమహా

## ఒరిస్సాలో మిశ్రమంత్రివర్గ నిర్మాణ యత్నాలు

### శాసనసభలో బలములేదు

ప్రభుత్వ ప్రకటన

కటకం, జులై ౨౫

ఉత్కళంలో శాసనసంఘసభ్యులలో వెనుకటి మంత్రివర్గానికి ప్రతికూలురుగా వుండినవారున్న మంత్రివర్గానికి అనుకూలంగావున్నవారిలో కొందరున్నుకలిసి మిశ్రమమంత్రివర్గమును యేర్పరచెదనియు, వీరిలో గోదావరిమిశ్ర గారు ప్రధాన మంత్రిగావుండిరనియు, కల్లికోటరాజాగారు కొన్ని ముఖ్యమైనశాఖలకు సంబంధించిన మంత్రిగా వుందురనియు, ఈమంత్రివర్గమువారుయుద్ధమునకు సంబంధించిన కార్యాలను చాలశ్రద్ధగా వుందురనియు, శాసనసభలలో మిశ్రమ మంత్రివర్గ పక్షమువారందరును మంత్రివర్గానికి అన్నివిధముల సహాయము చేతురనియు జూలైనెల ౧౬వ తేదిని ఉత్కళం గవర్నరుకు యీపార్టీవారు తెలియజేసినారు ఆరోజున వీరినాయకులు గవర్నరుతో సంభాషించినారు కాని మిశ్రమమంత్రివర్గము యేర్పడ్డతరువాత శాసనసభలలో హెచ్చుమంది యుద్ధసహాయమువిషయంలో వీరికిఅనుకూలముగా వోటుచెయ్యరేమో అనే సంశయంకలిగినది సాధ్యమైనంతత్వరలో శాసనసభలు జరిగేటట్టు కూడా కనబడలేదు అందువల్ల యీపార్టీనాయకులకు గవర్నరుకు మధ్యతరువాత సంభాషణలు సాగలేదుఅని గవర్నరుకార్యదర్శి ప్రకటించినాడు

కల్లికోట రాజాగారి ప్రకటన

యుద్ధసహాయ ప్రయత్నాలకు మేముమనఃపూర్వకంగా సహాయంచేస్తాం మీరుబహిరంగముగాను స్పష్టముగాను ప్రకటనచేసినగాని మిశ్రమపక్షములో చేరదలచిన కాంగ్రెసు పార్టీసభ్యులలో నేను మొదటినుంచి చెప్పుచునేవున్నాను. భారతకాంగ్రెసువారి పద్ధతిమీద మాకునమ్మకం లేదనియు ఇప్పుడు దేశరక్షణవిషయము చెయ్యవలెననియు, మిశ్రమపక్షంలో చేరదలచిన కాంగ్రెసువారందరు వెంటనే బహిరంగంగా ఒకప్రకటన చెయ్యవలెను. ఇదిముఖ్యతమమైనది దీనికి కాంగ్రెసుపార్టీవారిపక్షమున గోవర్ధనమిశ్రగారు అంగీకరమును తెలిపారు. మిశ్రమపక్షంలో చేరెదమని యిదివరకు మిశ్రగారికి వాగ్దానంచేసిన కాంగ్రెసువారిలో కొందరిప్పుడు వెనుదీయుచున్నట్టు తెలిసినది. భారతకాంగ్రెసువారి పద్ధతిమీదతమకునమ్మకములేదని బహిరంగముగ ప్రకటించుటకు వీరుభయపడుచున్నారనికూడా తెలిసినది. ఇటువంటిస్థితిలో మిశ్రమమంత్రివర్గము యేర్పడినట్టయితే శాసనసభలలో యీమంత్రివర్గానికి తగినంతబలముబడివుండదు వారితీర్మానములు నెగ్గవు వీరితీర్మానాలు నెగ్గకపోతే గవర్నరు శాసనసభలను రద్దుచేయవలసివచ్చునుకనుక ఇటువంటి పరిస్థితులలో మిశ్రమమంత్రివర్గమును యేర్పరచకూడదని మాపార్టీ వారభిప్రాయపడుచున్నారు అని కల్లికోట రాజాగారు ప్రకటించినారు

సభ ఆహ్వానసంఘాధ్యక్షులును, బాధ్యతగల ఆంధ్రనాయకులునగు శ్రీ కొండా వేంకటరంగారెడ్డిగారు "హిందూబాలికా (బాల్య) వివాహనిషేధపుబిల్లు" నేలశాసనసభలో ప్రతిపాదించిరి. అంతటితోబోక ప్రత్యేకముగా హిందువులకుమాత్రమే వర్తింపజేయబడిన వైతీర్మానము ఆంధ్రమహాసభలో ఏల ప్రతిపాదింపబడి ఆమోదింపబడినది? అంతేగాక ప్రజాభిప్రాయము బిల్లున కనుకూలముగామార్చి సంతకములుచేయించి పంపవలసినదని పట్టణసంఘములకేల తాకీదులు పంపబడినవి? ఇది మతపాక్షికములేకుండా నిష్కళంక జాతీయపునాదులపై నడుచుచున్న సంస్థయగుటచేకదూ?

నియమావళిలోమార్పుచేయుటకు కార్యకారిణీసంఘమునకు అధికారములేదు, అవ్యవధిగా తీర్మానముచేసితిమని సమర్థించుకొన్నను, పైపాక్షికసంస్థ స్థాపింపబడినతర్వాతనే మల్కాపురం ఆంధ్రమహాసభజరిగినది అప్పు డీవిషయమే చర్చించి నియమావళిలో మార్పుచేయలేదు కనీసము జిల్లా, పట్టణసంఘముల కార్యనిర్వాహకవర్గమువారి అభిప్రాయమైనను కనుగొనవలయునని వీరికి స్ఫురింపలేదా? ఇంత అవ్యవధిగా యీప్రకటన యేల చేయవలసివచ్చినది

కాబట్టి ఆంధ్రమహాసభ కార్యకారిణీవర్గమునను శ్రీఅధ్యక్షులవారికి మనవిఏమన యీవిషయములో జిల్లాసంఘముల అభిప్రాయమునైనా కనీసము కనుగొనువరకు ప్రస్తుతము చేసినప్రకటనను ఉపసంహరించుకొన ప్రార్థించుచున్నాము ఇప్పడే చేయవలసిన ఆత్మరక్షణయే ప్రధానాశయముగాగల హిందూమహాసభను, హిందూప్రజామండలిని, అంతరింపజేయక యుండుము గాక!

ప. కవేంద్రరావు, కా, ఓమాచె,
యల్-ఆర్-శర్మ,
మెదకుజిల్లా ఆంధ్రజనసంఘము

## దేశరక్షణ నియమాలక్రింద చర్యలు

కలకత్తా, జూలై ౨౨

పెషావరులో ఒక గొప్ప భూస్వామియున్ను కంటోను మెంటు బోర్డుసభ్యుడున్ను అయిన సయ్యదుమన్సూరు అహమదుగారిని నిన్న సాయంకాలము పెషావరులో అరెస్టుచేసిరి

అమృతసరు హిందూమహాసభ ఉపాధ్యక్షుడు పండిత గోవర్ధనదాసు వైద్య గారిని నిన్నమధ్యాహ్నం అమృతసరులో అరెస్టుచేసిరి

లాహోరులో లాహోరుజిల్లా రైతుసంఘప్రధాన కార్యదర్శిని మరియిద్దరు రైతునాయకులను అరెస్టుచేసిరి. జిల్లా రైతుసంఘ కార్యాలయమును సోదాచేసిరి

బెంగాలు లెజిస్లేటివు కౌన్సిలులో సభ్యుడుగావున్న లాలుమియా అనబడు ముజాంఅలీ చౌదరీగారిని కలకత్తాలో అరెస్టుచేసిరి.

సీతారాం అను కార్మికనాయకుని కలకత్తాలోను, ధర్మవీరసింగు అనే కార్మికనాయకుని ఖరగుపూరులోను అరెస్టుచేసిరి

కలకత్తా కార్మికసంఘపు అధ్యక్షుడు మహమదుఖాను గారున్నూ మరి ౧౨ మంది కార్మికనాయకులున్నూ ౨౪ గంటలలోగా కలకత్తాను వదలిపోవలెనని నోటీసులనుపంపిరి

పట్టణ కాంగ్రెసుసంఘపు అధ్యక్షుడున్నూ మిడ్నపూరుజిల్లా రైతుసంఘ కార్యదర్శియున్నూ అయిన ధీరేంద్ర నాధ దాసు గారు ౨౪ గంటలలోపున మిడ్నపూరుజిల్లాను వదలిపోవలెనని నోటీసు పంపినారు

మిడ్నపూరు కాంగ్రెసుసంఘ కార్యాలయ కార్యదర్శి నందలాలుసింగుగారు మిడ్నపూరు పట్టణ మ్యునిసిపలు సరిహద్దులను దాటిపోగూడదని నోటీసుపంపినారు

కలకత్తాలో వంగభాషలో ప్రతిదినము వెలువడు దైనిక "వసుమతి" పత్రికలో ౯-౭-౪౦వ తేది సంచికలో "తెల్పిస్టు" అనే శీర్షికగల వ్యాసమును ప్రకటించినందుకు సంపాదకునున్నూ ప్రధాన రాజధాని మేజిస్ట్రేటు నేడు హెచ్చరిక చేసి వదలినారు.

## యుద్ధవార్తలు

(మొదటిపేజీ తరువాయి)

లుగారి యాదేశముప్రకారము ఈజిప్టులో ఫ్రెంచిజాతీయ సంఘమువారు బ్రిటనుపక్షాన విజయముకలుగువరకు పోరాడెదమని జూలై ౨౩వ తేది తీర్మానించినారు.

### అమెరికా

అమెరికాఓడలు మరికొన్ని బ్రిటను, అమెరికాల ప్రభుత్వములచే కలిసి పరిపాలించబడుచున్న క్రిస్మస్‌దీవులకు పోయినవి. దక్షిణ పసిఫిక్ ప్రాంతములోని దీవులన్నిటివద్దను అమెరికా ఓడలు పహరాతిరుగుచుండు ఏర్పాటుచేయబడినది

అమెరికా ప్రభుత్వము పెట్రోలియం మున్నగు కొన్నివస్తువులను లైసెన్సుపొందిన దేశాలవారికే అమెరికావారలు అమ్మదగునని నిర్బంధము మును విధించినారు దీనిచే ఇటలీ జర్మనీలకు ఏ విధముగాని ఈసరకులు చేరకుండ పోవునని ఈ ఆజ్ఞ పరిణామమును వ్యాఖ్యానము చేసినారు,

### మితపానసంఘము

హైదరాబాదు మితపానసంఘమువారు (టెంపరెన్సువారు) నగరములోని ఖైరతాబాదులో ఒక ఆటమైదానాన్ని ఏర్పాటుచేసినారు దాని ప్రారంభోత్సవము గత శుక్రవారమునాడు కావించిరి.

## కలకత్తాలో హాల్వెలు స్మారకచిహ్న సత్యాగ్రహం

ఈనెల ౧౯-౨౦-౨౧ తేదీలలో అరెస్టు చేయబడిన ౩౬ మందికిన్నీ మేజిస్ట్రేటు నేడు చెరి ౬ నెలలు కఠినశిక్ష వేశాడు.

నేటిమధ్యాహ్నము సత్యాగ్రహముచేయుటకు ౨౫మంది ఒకగుంపుగావచ్చిరి. వారినందరిని అరెస్టుచేసినారు.

అమ్రావతీ జూలై ౨౨

బర్నీ రామిల్లు కార్మికసంఘాధ్యక్షులగు డా బి. కె దివాన్‌జీగారి గృహము, ఆఫీసు నేడు పోలీసువారిచే సోదాచూపబడెను, నాల్గుగంటలసేపు సోదాచూచిరి కాని ఆక్షేపణీయమగునదేమియు దొరకలేదు

## ఆంధ్ర యువజనసమితి

హైదరాబాదు (దక్కన్), మహారేవరు 22

హైదరాబాదు ఆంధ్రయువజనసమితి గత గురు శుక్ర, శనివారాలలో రెడ్డిహాస్టలులో తమ సంఘవార్షికోత్సవమును జరిపిరి, మొదటిదినము ఏర్పడిన అధ్యక్షులురానందున శ్రీ చిదిరెమఠం వీరభద్రశర్మ గారు అధ్యక్షులైరి. బాలబాలికల వక్తృత్వపోటీలుజరిగెను విద్యలో మతబోధస్థానమునుగురించి మాట్లాడిరి బాలికలలో డాక్టరు దామోదరం నాయుడుగారికూతురు మొదటి బహుమానముపొందెను రెండవదినము శ్రీ బూర్గుల రామకృష్ణారావుగారి అధ్యక్షతలో నాయకుల ఉపన్యాసాలుజరిగెను కార్యదర్శిగారగు వెన్నారెడ్డిగారు మొదట తమసంస్థ కేవలము రెడ్లవరకే ఉండెననియు తర్వాత అందరికిని ఏర్పాటుచేసిరనియు కాని తుదకుఅందులో ఆంధ్రులే చేరిరనియు అందుచేతదానికి ఈసంవత్సరమే ఆంధ్రయువజనసమితి అనుపేరుపెట్టితిమనియు ఉడుతభక్తివలె 100 రూ ఖద్దరు అమ్మించితిమనియు, ౫౦ సభ్యులున్నారనియు గ్రామకాస్త్రోమాస్త్రో నిలువపెట్టినామనియు చిన్న సంచారగ్రంథాలయాన్ని స్థాపించి అందు 400 గ్రంథాలవరకు సమకూర్చినామనియు తెలిపిరి. తర్వాత ఖమ్మం నుండివచ్చిన నారాయణరావుగారు తాముఖమ్మంలోచేసిన ప్రజాసేవనుగురించి దానివలనకలిగిన తమ అనుభవాన్నిగురించిచెప్పి చాలా అమూల్యమైన అభిప్రాయముల వెల్లడించిరి. తర్వాత "సారస్వతవీధి" అను విషయమునుగురించి విద్వాన్ రంగాచార్యులుగారును ఆర్యద్రావిడులు ఒక్కరేనా అనుచర్చను పండిత చిదిరెమఠం వీరభద్రశర్మగారును ఉపన్యసించిరి. శర్మగారు ఆర్యద్రావిడులు వేరుకారనియు అది ఆంగ్లపాశ్చాత్యుల మోసకృత్యమే అనియు తాము సేకరించిన ప్రమాణాలను యుక్తులనువెల్లడించి యుపన్యసించిరి. తర్వాత అధ్యక్షులవారు ఉపసంహారోపన్యాసము గావించి ముగించువరకు 9 గంటల రాత్రికాలమయ్యెను.



Printed and Published by, G. Ramakrishna Reddy at the Golkonda Power Press Hyderabad Dn, Editor- S Prathapa Reddy B A B. L